Regd No N.44
M. 3813

To Let

# గోలకొండ పత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

103448

సంపుటము ౧౮ ● హైద్రాబాదు దక్కను శా. శ. ౧౮౬౪ స్వభాను పుష్య బ. ౧౩ [౨౧-౪-౧౩౫౨ఫ] సోమవారము ● సంచిక ౭౧



## అరకాన్‌లో బ్రిటిషుసేనల విజృంభణ

### బర్మా

అరకాన్ నగరమందు బ్రిటీషువారి సేనలు మాయుపర్వత పంక్తికి పడమట వకాంగ్డాకుతూర్పునను, ఆగ్నేయమునందు బాగోనా, న్యాయు గ్రాములు రెండుగ్రామములను ఆక్రమించినవి. జపానీయసేనలు వాటినితిరిగిపట్టుకొనుటకుయత్నించివిఫలములైనవి. వకాంగ్డాకు ఆగ్నేయమునందు నల్పస్యావద్దను, తూర్పునందు రాజాదిల్ వద్దనుజపానీయసేనలు కోలోయిన స్థానములను తిరిగిపట్టుకొనుటకుయత్నము చేయబోగాబ్రిటిషు సేనలు వాటినితరిమివేసినవి. జపానీయులున్ట్లే కానిజన్గాకునకు రాజాదిల్ కును మధ్యనున్నదియునది మీద నుండువంతెనలను వకాంగ్డాకుదక్షిణమునను తూర్పునవుండు వాటినితిరిగిపట్టుకొన బోయివిఫలములైనవి. బుధిడౌనుకు ఈశాన్యమున వాస్విక్ వద్దకూడ జపానీయుల ఎదురుదాడులు తిరిమివేయబడినవి.

చిన్‌డ్విన్ రంగమందుతౌషు అనుపోటికిఉత్తర మైళ్ళుఆగ్నేయమున ౧౫ మైళ్ళదూరంలో క్యాంక్యా ప్రదేశమందు జపానీయసేనల స్థానములపై బ్రిటిషువిమానాలు దెబ్బలనువేసినవి. హుకాంగ్ లోయలో అమెరికనులవద్ద శిక్షణ పొందిన చైనీయసేనలునింఘిదెబూ ప్రదేశమందు గుంగాలోయను పట్టుకొనితూర్పుగా పోవుచున్నవి.

### చైనా

చైనాలోఅన్హ్వీ రాష్ట్రములో జపానీయులు పట్టుకొనియుండిన మాచైన్హును, చైనీయులు మరల గ్రహించినారు. ఇట్లే చైనీయులు యాంగ్సీనదంగమునందుజపానీయులు తీసుకొనియుండిన ఒకపట్టణమును పునరాక్రమించినారు.

ఇండోచైనాలో జపానీయసేనలు వశమందున్న రైల్వేలపైనను ఓడరేవులపైనను చైనానుండిఅమెరికనువిమానములుపోయి బాంబులను వేసినవి.

### పసిఫిక్ ప్రదేశము

పసిఫిక్ ప్రదేశమందుజపానువారి మార్షల్ దీవులపై అమెరికనువిమానములదాడులు జరిగినవి. జనవరి ౨౧వ తేదిన జపానువారి శాసనసభయగు న్యూబ్రిటనులో ఆరావేరంగమందు అమెరికనుసేనకో చేరియున్న రెడ్ ఇండియను సేనలజపానీయుల సేనలను వెనుకకుతరిమివేయుచున్నది

### ఇటలీ

ఇటలీలోతూర్పు వైపునఅమెరికా వారి సేనలు సా. ట్రోకియోను ఆక్రమించిరాపిడో నదితూర్పుగట్టునుచేరినాసినోకు ఈశాన్యమునందు సాంతాలియాను ఆక్రమించినవి. తర్వాత ఆసేనలు గారిగ్లియానోనదిని అనేకచోట్లదాటి రాపిడోనదినుంచి గేటావరకు ... సేనయొక్క రక్షణశ్రేణులను భేదించినవి.

పిమ్మట అనిసూయిట్‌టూఫో, ఆర్జెనిటా అను మూడుపట్టణములను ఆక్రమించినవి. అక్కడినుండి ఆసేనలుసముద్రతీరమందున్న గేటా, మిన్నర్నో పట్టణముల పరిసరములకు చేరినవి. మించర్నోఅను నదిఉత్తరము, ముఖ్యమైన రోడ్లుకూడలిమార్గము లనుకలియు పట్టణము

కాస్సినోరంగమునకు ఈశాన్యమున్న ఫ్రెంచి సేనలు మాంటీడిమెరోకొండమీద ఒక ఉన్నతస్థానములో పాటు, మరికొన్ని స్థానములనుపట్టుకొనినవి

సముద్రతీరమున అడ్రియాటిక్‌వైపున ఏ రీ వీ కి ఎదుట కనడావారి సేనలు కొంతముందుకుజరిగిపోగలిగినవి. కాని మరొకచోట కనడావారి సేనలు వెనుకకు పోవలసివచ్చెను.

---

## నోటీసు

యిందుమూలమున సమస్త జనులకు తెలియజేయుట యేమనగా నేను రాఘవాపూర్ యిలాఖే స్టేటు రాజా ధరంకరణ్ బహద్దర్ యొక్క వాస్తవ్యుడను- మాయొక్క సమిష్టి కుటుంబమునకు కొన్ని పట్టాభూములు మఖ్తాలు వతన్లు మున్నగునవి యున్నవి. స్వంతముగా (మకబూజా) సంపాదించినపట్టాభూమి మొదలైన స్థిరాస్తులుగూడ రాఘవపురములో యున్నవి.

మేము మాతండ్రిగారికి 6గురుపుత్రులము. మేము అందరము సమానహిస్సాదారులము అందులో 4 చనిపోయి యిద్దరము మాత్రము బ్రతికియున్నాము. యిప్పుడు నాతమ్ముడగు రామారావున్ను మా సోదరులపుత్రులుయున్నాము నాల్గు సంవత్సరములకు ముందు ఐకమత్యముగా మా రాజీరజామందితో మా పెద్దలు సంపాదించిన ఆస్తిని మాకుటుంబములో అక్షివద్ధతిగా హిస్సాలనుతక్సీం చేసుకొని, కార్యభారములు తగ్గించుటకై ఎవరిహిస్సాకు వచ్చిన భూములు వారిఖబ్జాలోయుండి యింతెజాం చేయబడుచున్నవి. స్వయం సంపాదన విషయమై ఎవరిదివారే వారివారిజీవితపర్యంతరము యితరుల ఆటంకము లేకుండా అనుభవించి, నాతదనంతరముమాత్రమే నాఆస్తి విభజింపగలరు. ఈ ప్రకారము అమలులో యున్నది.

ప్రస్తుతము నాతమ్ముడు రామారావు, నాసోదరుల పుత్రులను తోడుచేసుకొని నా స్వయముగా సంపాదించిన ఆస్తినిగూడా విభాగములలోనికి తేవలయునని పన్నుగడలు చేయుచున్నట్లు తెలియుచున్నది. వాటిని తక్సీలు చేయుటకు దస్తావేజులుగూడతయ్యారు చేయుచున్నట్లు తెలియుచున్నది. యిందులో ముఖ్యమైన కొందరు పెద్దలు గూడ అనగా, తక్కెళ్లపల్లి రంగారావుగారు, ఒటేల్ మవుజె అక్కన్నపేట, తా॥ కరీంనగరు, గోపాల్‌రావుపట్వారి రాఘవపూరు పెద్దూరు రంగరావు మొ॥ పెద్దూరు తా॥ సిరిసిళ్ళ గారుగూడ యిందు సంబంధము కలిగించుకొనుచున్నట్లు తెలియుచున్నది ఈపద్ధతిని నేను ఏమాత్రము ఒప్పుకొననని తెలిసికొని నాబదులుగా మరొకరిని నాపేరుతో (తబ్దిల్ షక్సీ) రిజిష్టారు వద్దకు తీసుకొనివెళ్లి దస్తావేజులను రిజిష్టరు చేయించుకొనునట్లుగా రూఢిగా తెలియుచున్నది అందుకుగాను యీ ప్రకటన మూలముగా నాయొక్క పట్టా భూములు, రాఘవాపురములో 171 ఖాతాగలవి యింకా నాయితర స్వంతఆస్తి (మఖ్బూజా)పైన నాతమ్మునికగాని, నాసోదరుల కొడుకులకుగాని ఏలాంటి హక్కులేదు. నా యిష్టము లేనిది ఎవరికి హక్కుండజాలదు, పైన చూపబడిన నా స్వంతఆస్తి మంతఖిల్ చేయుటకుగాని, హిబా చేయుటకుగాని హక్కు నాకే గలదు అందుకనే నా స్వంత ఆస్తిని పంపకము విషయమునగాని లేక యితర విషయములకు సంబంధించిగాని వ్రాయబడు దస్తావేజులందు నాతమ్ముడు లేకసోదరుల పుత్రులవగ్యలపై బాధ్యతఏమిగాను లేదు. అందుకని యీ ప్రకటన చేసియున్నాను.

దీనిప్రతులు, తక్కెళ్లపల్లి రంగారావు, అక్కన్నపేటగోపాలరావు పట్వారి మొ॥ రాఘవపూర్ రంగారావుమద్దూరు గార్లకి పంపనైనది. యిదిగాక రిజిష్ట్రారు సా॥ రాజా ధరంకరణ్ బహద్దురు స్టేట్ అమీనుపేట గారికి పంపుకొననైనది

పున్గోటి హనుమంతరావు,
వల్లు కిషన్‌రావు.
రాఘవపూర్ – యిలాఖె స్టేట్ ధరంకరణ్ బహద్దర్

---

## రాజా ఖాజాప్రసాద్ గారి మరణ కారణము

దైవికోపద్రవమని
బొంబాయి కారోనర్ గారి తీర్పు

బొంబాయి జనవరి ౨౦

బొంబాయినగరంలో తాజ్‌మహల్ హోటలులో డిసెంబరు ౨౧వ తేదిన మరణించిన రాజా ఖాజాప్రసాద్ బహద్దర్ గారినిగురించి కారోనర్ గారి కోర్టులోజూరీ వారు ఆ మరణమునకు కారణము దైవోపద్రవమునితెలిపిరి. ఖాజాప్రసాద్ బహద్దర్ గారు త్రాగినమత్తులో తాను తనపడకగదిలోనుండినట్లుభావించి భోజనపుగది పైకప్పు మీగనుండి బయటికిఅనుకుపెట్టినవని జూరీవారనిరి. ఎవరైనను హత్యచేసియు...మరణించుటకు కారణము లేదనిరి.

---

## రైస్ మిల్ వేలము

యిందువలన అందరికి తెలియచేయుట యేమనగా జడ్చర్లా స్టేషన్ (బాదెపల్లి) జిల్లా (మహబూబ్‌నగర్) గంజ్ సమీపములో వున్న నాయొక్క స్వంతం ఫ్యాక్టరీ యీక్రింద నుదహరించిన సామానుల సమేతముగా దివి ౩-౨-౪౪ (తా॥ ౧ ఫర్వర్ది ౧౩౫౩ ఫ.) మాసు తే॥ ౧౦ గురువారం రోజున ౧౨ గంటల నుంచి నాకుపీతో వేలముద్వారా విక్రయము చేయబడును.

౧. భూమి ౨ యెకరముల ౩౪ గుంటలు యిందులో చేదుడుభావి కంపౌండు గురించి తీయబడిన కాల్పురవుతు. ౨. బిల్డింగు తప్సీల్- యిటుకా సున్నంతో చాలుగా ఫౌండేషన్ తీసికట్టబడిన ౧ ఆఫీస్‌రూమ్ ౧ స్టోర్‌రూమ్ ౧ యింజన్‌రూమ్ ౧ గోడాంరూమ్ ౮౫-౩౧అడుగులుగల మధ్యహాల్ ముందర వరండా కాల్వరేకులతో బందోబస్తుగా నూతనంగా కట్టిన ఫ్యాక్టరీ. ౩. క్లాక్ స్టోన్ ౩౨-౩౪ హార్సుపవరుగల క్రొత్తగాయున్న యింజన్ గ్యాస్‌టాంకీతోసహా. ౪. మార్గలు హాల్లను ౨ రెండు, షెల్లరు ౩౪౦ పూర్ట్లుగలదిఒకటి ౫. ౪ ౨౪౦ పూ ౪౫ పొడవుగల షాఫ్టింగు యస్. కే. ఎఫ్. బాల్ బేరింగులతో సిటింగ్ చేయబడినది. ౬ యస్.కే.యఫ్, బాల్ బేరింగులతో ఫిటింగ్ చేయబడిన మూడు ఎలివేటర్లు. పూర్తి రైస్‌మిల్.౭. సాంగ్లి డిస్ట్రిబ్యూటర్ క్లీనింగ్ మిషన్ కొత్త జాలిలతో మంచికండిషన్‌లో వున్నది.౮ రెండు అయిల్‌టాంకీలు మరియు స్టోర్ సామానులు మిల్లుకు సంబంధించినవి.

యీ పైనదహరించిన సామానుల యుక్తం సదరు తారీకున వేలము కాబడును. యిందుకు షర్తులు.

౧ ఫైనల్ స్థిరపరచే అధికారం యీక్రింద వ్రాయబడిన యెజమాని అధీనములో వుండగలదు.

౨. వేలపాట యెవ్వరి పేరు ముగిసినయెడల వారు ఆ తక్షణం సూటికి రూ॥ ౨౫ చొప్పున అప్పుడే చెల్లించవలయును. మిగత మొత్తం రూపాయలు రజిస్ట్రార్ ఆఫీస్ మహబూబ్‌నగరంలో వారం దినములలో రిజిష్టరు చేయించిన సమయమందు యివ్వవలయును.

౩. పైన తెలిపిన గడువుదినములలో మిగతపైకము చెల్లించని యెడల ఆస్తి అతని జవాబుదారిపై తిరిగి విక్రయము చేయబడును మరియు కలిగిన నష్టమును అతడు యివ్వవలసివుండును గాని తిరిగి అమ్ముటవలన లాభంవచ్చినయెడల అట్టి లాభముపై మరియు యిచ్చిన బయానాపై అతనికియేవిధమైన హక్కువుండ నేరదు.

౪ స్టాంపు రజిష్టరీ విక్రయపత్రం వ్రాయు ఖర్చులు మొదలగు తదితర ఖర్చులు కొనువారే భరించవలయును

రైసుమిల్లు కొనదలచినవారికి అనుకూల్యావకాశము యింత మంచి తరుణము దొరుకదు.

ఇట్లు
మాధంశెట్టి కిష్టయ్య
జడ్చర్లా

---

## త్రిలింగ
# ఆరోగ్యబీడి

ఆనందమునిచ్చెడి ఆరోగ్యబీడీనే త్రాగండి

ఆరోగ్యబీడి అనగానే దానిసుగుణములు వేరే చెప్పవలసిన అవసరములేదు. మా బీడీలు శ్రేష్ఠమైన పొగాకుచేమంచిసిటీకి శుభ్రపరచిన తునికిఆకులతో బీడీలుతయారు చేయుటలో గొప్పఅనుభవము పొందినపనివాండ్రచే తయారుచేయించి బహుశ్రద్ధతో పరీక్షచేసినతరువాతనే ప్యాకింగుచేసి బజారులో అమ్మకమునకు పంపబడుచున్నవి. ఈబీడీలు త్రాగువారికిఅమిత ఆనందముచేకూర్చునన్నమాట మేము చెప్ప నక్కరలేదు. ఒకపర్యాయము త్రాగిచూచిన దాని సుగుణము ఆనందము మీకే తెలియగలదు. హైద్రాబాదుస్టేటులో విరివిగా సప్లయిచేయబడి అన్నిచోట్ల అమ్మబడుచున్నవి.



మ.ఘ.వ. నిజాం సర్కారువారిచే నెం. 279 క్రింద రిజిస్టరు చేయబడినది.

మా బీడీలు కొను నప్పుడుయీపక్కన ఉన్న ట్రేడ్ మార్కును చూచి కొనండి, నక్కలమాలను చూచి మోసపోవద్దు.

ఏజంట్లులేని ప్రతిదేశమునందును ఏజంట్లు కావలెను.

ఒకొక్కఊరికి ఒక్కఏజంటునే నియమించవచ్చును కావున త్వరపడుడు మావ్యాపారస్థులకు మంచి లాభమును, అనుకూలములను కల్గునట్లు ఏర్పాటుచేయుగలము షరతులకు క్రిందిచిరునామకు వ్రాయండి

ది చీఫ్ ఆర్గనైజరు
త్రిలింగఆరోగ్య బీడికంపెనీ
కొత్తపల్లి — కరీంనగరు జిల్లా

ఏజంటు: హైద్రాబాదు, సికింద్రాబాదులకు
చుంచు సత్తెయ్య
మహరాజ్‌గంజ్ చౌక్, హైదరాబాదు

సిద్దిపేట ఏజంట్లు.—
అల్లాజ్ పురి రఘూపసేట్
సిద్దిపేట

కరీంనగరం జిల్లాకు ఏజంటు
హాఫీజ్ నిసార్
అహమద్ సాహెబు
కమీషన్ ఏజంటు మరియు జనరల్ మర్చెంటు,
కరీంనగరం.

జనగాం, ఆలేరు, భువనగిరులకు ఏజంటు
బండారు అగయ్య ఆలేరు

---

గోలకొండ పత్రిక

స్వభాను సంవత్సర పుష్య బ ౧౫ సోమవారము

# ఆంధ్ర సారస్వత పరిషత్తు

ఐర్ దీవిగడ్డ చాలా చిన్న దేశము. అది ఆర్యసంతతికి చేరినదగుట దాని పేరు ఆర్యశబ్ద భవమగు ఐర్ అని యేర్పడెను. ఆదేశమిప్పటి మా ఆదేశము ఇంగ్లాండుకు రెండుకోసుల దూరములో నేడున్ననుఇంగ్లీషువారికి ఐర్ జాతివారికిపోలికలు కుదురలేదు. ఐరుభాష వేరు, రుచులు వేరు. మతమ్ములో కొంత భిన్నతకలదు. జనుల స్వభావములో చాలా భేదమున్నది. అట్టి ఐర్ దేశాన్ని ఇంగ్లీషువారు లోబరచుకొని ౭౦౦ సంవత్సరాలు పాలించిరి. కాని ఆదినుండియు ఆ చిట్టిదీవిగడ్డ స్వాతంత్ర్యమునే కోరుచువచ్చినది. తుదకు ౨౦ ఏండ్లక్రిందట సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించుకొనెను. ౭౦౦ ఏండ్లనుండి ఆచిన్న ద్వీపవాసులపై ఇంగ్లీషుభాష పూర్తిగా మోపబడెను. వారు స్వాతంత్ర్యముపొందిన మరునాడే భాషాదాస్యమును దులుపుకొని మూలబడి చావలేక మూల్గుచుండిన తమ ఐరుభాషను పునరుద్ధరించిరి. ఇప్పుడు తమ భాష బాగా జనులలో జీర్ణించుకొని పోయినది.

ఐర్ దేశము భారత దేశానికి ఆదర్శప్రాయమైనట్టిది. అంతటి చిన్న దేశము తనభాషను, తన స్వాతంత్ర్యాన్ని, తన సంస్కృతిని నిలబెట్టుకొనినప్పుడు మన భారతదేశమంతటి గొప్పదేశము, ఐర్ దేశముకంటె ఇంచుమించు ౫౦అంతలు పెద్దదైన మన దేశము ఎంతటి గుణపాఠమును నేర్చుకొనవలెనో ప్రతివాడును తెలుసుకొని యుండవలెను. ఇట్టి భావపరంపరలో నుండినప్పుడు నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తునకు ఏలాటి సంకోచములును ఉండరాదు. ముల్కీ భాషలకు రాష్ట్రవిద్యా విధానములో చెప్పుకొనదగిన స్థానములేదు నిజమే. ప్రైమరీవరకు ముల్కీభాషలలో విద్య చెప్పితే అది సంతోషింపదగిన విధానమే కాదనియు ప్రైమరీ మాతృభాషా విద్యతో ఏజాతియు వృద్ధికి రాదనియు మనకు తెలియున్నుమన ప్రభుత్వానికి తెలియును, ప్రపంచానికి తెలియును. కావున ఆ విధానం మారక తప్పదు. అంతవరకు ప్రజలు ఓపికపట్టవలెను. ప్రభుత్వము చేయవలసినపనిని సారస్వత పరిషత్తులు చేయజాలవు. అవేమైనా అనుకూల వాతావరణమును కల్పించును.

ని. రా. ఆంధ్రసారస్వత పరిషత్తును పురిటిలోనే గంతు కొట్టింతమని ఎవ్వరో స్వార్థపరులు ఇది రాజకీయ సంస్థసుమా అని జనులను బెదరించినారట. రాజకీయసంస్థ కానేకాదయ్యా, దీనిలో పనిచేసేవారి భావాలెట్టివైనా సరే, వారు దీనిలోపనిచేయు హద్దువరకు దీనిలో రాజకీయాలను కలుపజాలరు- అని తత్కార్యదర్శులు వెల్లడించినారు.

ఈపరిషత్తులోని సుగుణవిశిష్టత యేమనగా, ఇది తెలంగాణావాసులందరి సంస్థ. దీని నియమాలతో ఏకీభవించిన వారందరున్నూ దీనిలో సభ్యులుగా చేరవచ్చును. ఇది పైనేటు కంపెనీ కాదు దీనిలో పేర్లు వాటాలులేవు లాభాలు అస్సలేలేవు. దీనికి మొనాపలీ లేదు. దీనిలో రహస్యాలులేవు. దీనిపై తెలంగాణా విద్యావంతుల కందరికిన్ని అభిమానమప్పుడే కుదిరినది. ఆంధ్రరాజకీయ నాయకులున్నూ వర్ధస్వఅని యీ శిశువును అశీర్వదించినారు. ఈ శిషువోషణలో మాస్కో-క్రెమ్లిను మిక్ శ్చరు కాని, వార్ధాకాంగ్రెసు ద్రావకముకాని కలిపియియ్యమని వాగ్దానముచేసినారు. కావున ఇది రాజకీయసంస్థ వాసనకలదని అబద్ధప్రచారముచేసే స్వార్థుల వదంతులకు సకాలములో స్వస్తి చెప్పుటయైనది.

పరిషత్తువారు ౫౦౦౦ రూపాయీలను మాత్రమే కార్యనిర్వహణమునకై ఈసంవత్సరము కోరినారు. పనిచేసేవారుండవలెకాని అదేపాటిది అని ఆ నాడే చెప్పినాము, ఈనాడును చెప్పుచున్నాము. ప్రతిసంవత్సరం ఆంధ్ర మహాసభ జరుగు మూడుదినాలలో రూ॥౫౦౦౦లకు పైగావ్యయంచేయుటలేదా? ఈసంవత్సరము పరిషత్తువారుకొన్ని గ్రంథాలను ప్రచురించుచున్నారు. అది చాలామంచి సందేశము. వారిమాటను వారు దక్కించుకొందురోలేదో చూడగోరుచున్నాము. పరిషత్తును బలపరచుటకు శాఖలుయింకను విరివిగాస్థాపితము కాలేదు. ఆ ప్రయత్నాన్ని వెంటనే చేయవలెను. పరిషత్తు ప్రాథమికదశలోనున్నది. అది స్థాపితమై ఎనిమిదినెలలే అయినవి. కావున ఇంతవరకు జరిగిన పని ఎక్కువగాలేదే అని విచారపడనక్కరలేదు కార్యకర్తలుజిల్లాలలోను, తాలూకాలలోను కార్యదీక్ష గలవారినే ఏర్పాటుచేయవలెను. సభ్యులను వేలకొలదిగా చేర్పవలెను. ఉత్తమగ్రంథము నుసిద్ధముచేయించి ప్రకటించవలెను. భాషాభిమానమును, సారస్వతప్రీతిని, కళాభిరుచిని, ఆంధ్రులలో వ్యాపింపజేయవలెను. తెలంగాణాలోని ఆంధ్రులందరికిని సంబంధించిన యీసారస్వత పరిషత్తునకు నిత్యాభివృద్ధిని కోరుచున్నాము.

## ప్రభుత్వపు ధాన్యపు వసూళ్ల స్కీము, ప్రజల ఇబ్బందులు

ఈసంవత్సరము ఆంధ్రమహాసభ సభ్యత్వము చేర్పించుటకు చాలాగ్రామములు తిరిగినాను ఏ గ్రామముపోయినను అనావృష్టివలన, అయినవృష్టి సకాలమునకానందున పునాస, రబ్బిపంటలు చాలాభాగము చెడిపోయినవి. ఇదేపరిస్థితులలో ప్రభుత్వధాన్యపు వసూళ్ళస్కీమువచ్చినది మొదట ఈస్కీములో కొన్నిలోపములున్నప్పటికి తర్వాత కొన్నిలోపములను సవరించిరికాని ఈ ఆజ్ఞలు గ్రామాలకు చేరలేదు. ధాన్యమువసూలు చేయవలసిన ఈసమయములో స్థానికాధికారులు నిరంకుశులై ప్రభుత్వమిచ్చిన మినహాయింపులను సైతము లెక్కచేయకుండ రైతులను కష్టపెట్టుచున్నారు. అనేక గ్రామాలనుంచి ప్రతిరోజు రైతులు ఆంధ్రమహాసభ ఆఫీసుకువచ్చి మొరపెట్టుకొనుచున్నారు గ్రామాలకువెళ్లి పంచాయతీదారులను విచారించగా వారుమాకు ధాన్యమువసూలుచేయుమని తప్పితే రైతులకుఇచ్చిన మినహాయింపులను గురించి ఏఆజ్ఞలు రాలేదనియు, మేమేమి సహాయముచేయజాలమనియు చెప్పుచున్నారు అత్యవసరమైన ఇటువంటి ఆజ్ఞానూతనలను గ్రామాధికారులకు అందజేయకుండుట శోచనీయము

వట్టికొండ నాగేశ్వర రావు

## హైద్రాబాదు ఆంధ్ర విద్యార్థి మహాసభ

పైమహాసభ యొక్క ఆహ్వానసంఘాధ్యక్ష కార్యదర్శులిట్లు తెల్పుచున్నారు.

మహాసభకు ప్రభుత్వమువారి అనుమతి లభించినది ౨౯-౩౦-౩౧ జనవరి ౧౯౪౪ తేదీలలో రెడ్డి విద్యార్థి వసతిగృహమునందు శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారి అధ్యక్షతన మహాసభ జరుగును.

మహాసభలో ప్రవేశపెట్టబడు తీర్మానములు ౨౫జనవరి౧౯౪౪ తేదిలోగా విద్యార్థులు పంపవలెను. ఆహ్వానసంఘసభ్యులుగా చేర్చుకొనబడును మహాసభను విజయవంతముగా నొనర్చుటకు విద్యార్థి సోదర సోదరీమణు లెల్లరును ప్రార్థితులు. తెలంగాణాప్రాంతములో నివసించు హిందూ-ముస్లిం మరియు క్రైస్తవ మతభేదము లేకుండ విద్యార్థి విద్యార్థినులందరిఅభ్యుదయానికై పాటుబడే సంస్థయని స్పష్టపరుచుచున్నాము. ప్రస్తుతమా ఆహ్వానసంఘములో సభ్యులుగా చేరు విద్యార్థులందరు ఈసంవత్సరము మహాసభకు ప్రాథమిక సభ్యులుగాకూడ పరిగణింపబడుదురని తీర్మానించనయినది. సభ్యత్వరుసుము రఅణాలు ఏర్పాటుచేయబడినది ప్రత్యేకవిరాళములు కూడ మాకార్యకర్తలు రసీదులిచ్చి వసూలు చేయుదురు.

## ఫ్యాక్టరీ వర్కర్సు యూనియన్ ఖమ్మంమెట్టు

(౭ వి.)

౧౭-౧-౪౪ సాయంత్రము ౫గంటలకు యూనియన్ సర్వసాధారణసభ్యుల సమావేశమై యీ క్రిందితీర్మానములను తీర్మానముచేసి సమావేశమునకు సుమారు (౬౦) మంది విచ్చేసిరి.

ఖమ్మంమెట్టుఫ్యాక్టరీవర్కర్సు యూనియనుకు వరంగల్ అజంజాహీమిల్లువర్కర్సు యూనియన్ కార్యదర్శిగారగు కామ్రేడు సర్వదేవభట్ల రామనాథం బి.ఏ.గారిని యూనియన్ అధ్యక్షులుగా ఎన్నుకొనుచున్నాము.

నిరుద్యోగులుగాయున్న ఫ్యాక్టరీ వర్కర్సు యూనియన్‌లో సభ్యులుగా చేరవచ్చును. అట్టి సభ్యుడు నెలగకి ౦-౧-౦చొప్పున చందా చెల్లించాలి. ఏఫ్యాక్టరీలోనైన ఖాళీవచ్చినప్పుడు నిరుద్యోగులను సీనియార్టీ ప్రకారం (యూనియన్ సభ్యత్వములో) పనిలో ఏర్పాటుచేయబడును.

౩. అజంజాహీవర్కర్సు యూనియన్ స్థాపించినప్పటినుంచి మేనేజిమెంటు కార్మికులను అనేక యిబ్బందుల పెట్టినారు. వాటినివిచారించి కార్మికుల న్యాయమైనకోర్కెలను అంగీకరించమనియు యీ యూనియన్‌వారు కోరుచున్నారు.

## నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ జిల్లాకమిటి వరంగల్లు

౨౫-౧-౪౪ శుక్రవారమునాడు నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ వరంగల్లుజిల్లాకమిటీ సమావేశము జిల్లాకార్యాలయములో సాయంత్రం౪గం॥ లకు జరుగును. కాన సభ్యులెల్లరురా ప్రార్థన.

రాజలింగం,
జిల్లా కార్యదర్శి.

## రెడ్డిహాస్టల్ రజతోత్సవము

### మానుకోట తాలూకా వసూళ్లు

| | | | | |
|---|---|---|---|---|
| మ రా॥ శ్రీ రావుల వెంకట నారసింహారెడ్డిగారు | దేశముఖు | గూడూరు | రూ॥ | ౨౫ ౦౦ |
| ,, ,, పుల్లారెడ్డిగారు | ,, | ,, | ,, | ౨౫ |
| ,, నూకల రామకృష్ణారెడ్డిగారు | ,, | గుండెపురి | ,, | ౫౦ |
| ,, గడ్డం అచ్చిరెడ్డిగారు | | ,, | ,, | ౩౦ |
| ,, కోట నర్సయ్యగారు | | ,, | ,, | ౨౫ |
| ,, గుండ పాపిరెడ్డిగారు | | ,, | ,, | ౨౫ |
| ,, రామడుగు రత్నయ్యగారు | | పాలెం | ,, | ౩౫ |
| ,, కోట నారాయణ రెడ్డిగారు | ,, | బురహాన్‌పురం | ,, | ౨౫ |
| ,, రామసహాయం రాఘవరెడ్డిగారు | దేశముఖు | కొణంచెర్ల | ,, | ౫౦ |
| ,, ,, రంగారెడ్డిగారు | ,, | ,, | ,, | ౨౫ |
| ,, మారంరాజు శివరావుగారు | | ,, | ,, | ౧౦ |
| ,, బాపల సీతారామరెడ్డిగారు | | తాళ్ళపూసలు | ,, | ౧౫ |
| ,, కీసర నరసింహారెడ్డిగారు | దేశముఖు | మహమ్మదాపు | ,, | ౫౦ |
| ,, రామసహాయం పాపయ్యగారు | ,, | పోచారం | ,, | ౩౦ |
| ,, ,, దేశాయిగారు | ,, | ,, | ,, | ౫ |
| ,, బసవరాజు రామచంద్రరావుగారు | | బీరవోలు | ,, | ౨౦ |
| ,, కటుకూరు నారాయణరెడ్డిగారు | మక్తేదార్ | చీరవరము | ,, | ౫౦ |
| ,, ,, వెంకటరెడ్డిగారు | ,, | ,, | ,, | ౨౫ |
| ,, ,, వెంకట నరసింహారెడ్డిగారు | ,, | ,, | ,, | ౨౫ |
| ,, నూకల రామచంద్రారెడ్డిగారు | దేశముఖు | ఎర్రచర్ల | ,, | ౫౦ |
| ,, చింతరెడ్డి వెంకటరెడ్డిగారు | ,, | ,, | ,, | ౩౦ |
| ,, నూకల నారాయణరెడ్డిగారు | ,, | ,, | ,, | ౨౫ |
| ,, ,, వెంకటరెడ్డిగారు | ,, | ,, | ,, | ౧౦ |
| ,, యర్రంరెడ్డి రంగారెడ్డిగారు | | ,, మొదుగులగూడెం | ,, | ౮ |
| ,, ,, రాఘవరెడ్డిగారు | | నల్లెల్ల | ,, | ౫౦ |
| ,, నూకల నారాయణరెడ్డిగారు | దేశముఖు | ఉప్పరిగూడెం | ,, | ౧౫ |
| ,, కనుమంతరెడ్డి నారాయణరెడ్డిగారు | | గ్రామం దేవునిపంటీస | ,, | ౩౦ |
| ,, కొండపల్లి నరిసిరెడ్డిగారు | దేశముఖు | మన్నెగూడెం | ,, | ౫౦ |
| ,, భైరెడ్డి పాపిరెడ్డిగారు | | అబ్బాయపాలెం | ,, | ౨౦ |
| ,, కుడితి లక్ష్మినరసయ్యగారు | | మర్రెడ | ,, | ౭౫ |

పైఎ తలకు ఆహ్వానసంఘమువారు తమ కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నారు.

## అరెస్టులు

కరీంనగరంజిల్లా ఆంధ్రమహాసభ ఉపాధ్యక్షులును, ఆంధ్రమహాసభ కార్యకారిణీ సంఘసభ్యులనుఅగు శ్రీయుత బద్దంయెల్లారెడ్డిగారినిఖానూతతహఫుజ అవకాఅనుదఫా (౨౫)మరియు హాయిద్రాబాదురతుణ నియమావళి (౬౬) క్రిందటకరీంనగరంస్టేషనుహౌసు పోలీసు (౧౪) ఇస్ఫందారు నాడు అరెస్టుచేసి ౧౫ఇస్ఫందారునాడు కరీంనగరం మునసఫిలో చాలాను చేసినారు. జమానతు పైనుంచి వారివిచారణజరుపుటకు దరఖాస్తుఇవ్వబడినదపరిష్కారమునకుగాను (౧౬)వ తేదీ ఇస్ఫందారు నాటికి నిర్ణయించినారు. నగునూరుగ్రామంలో ధాన్యంఇవ్వవద్దనిచెప్పినాడని వీరిపైన నేరంమోపబడినది. జిల్లాసంఘపక్షమున ఇక్కడిపంటలపరిస్థితిని కొం-నిప్రభుత్వానికిమొమొరాండంపంపించేనిమిత్తం పరిస్థితులను విచారించుటకుగాను పై నగునూరు గ్రామానికి (౧౧) బహమన్‌నాడు వెళ్లియుండిరి. ప్రభుత్వమువారికి పంపినమొమొరాండంలో పైన గునూరు గ్రామపుఅంకెలు గూడ ఉదహరింపబడినవి. ఆ దేశే దినచొప్పవండికాపురస్థులగు కరీంనగరం ఆంధ్రమహాసభ జిల్లాసంఘ సభ్యులును అగు గుర్రంచిన ఎల్లారెడ్డిగారినిగూడఅరెస్టుచేసి చాలాను చేసిరి. వారిని ప్రస్తుతము జమానతుపైడుంచి నేరము విచారణచేయుటకుఆజ్ఞ ఇవ్వబడినది కానివారికికరీంనగరంగ్రామంలో నేఉండవలెననిమరునిర్ణయింపబడినది.

## ధాన్యగ్రహణంలో కష్టములు

### భూమ్యాదాయశాఖావారికి మొఱ

హైదరాబాదు (ధక్కన్)، జనవరి ౨౨ బాగాత్ జిల్లాలో మంచాలగ్రామంనుండి ౩౦ మందిరైతులు ఇపుడు ఇక్కడికివచ్చి యున్నారు. వీరలుభూమ్యాధాయ శాఖ వారికి ధాన్యగ్రహణపు చిక్కులవిషయమై మొఱపెట్టుకొనుటకై నేటికినాలుగురోజులనుండి యత్నించుచున్నట్లుతెలిపినారు. ఈరైతులు తమవద్ద ఇపుడుధాన్యములేదనియు, అందువల్లతాము ధాన్యమునీయజాలమనియు తెలుపుచున్నారు హైదరాబాదునగరమునుండి ధాన్యమునుతీసికొనిపోయి యిచ్చుటకు అవిధమునధాన్యమునునగరమునుండి తీసికొనిపోవుటకును ఆటంకములు పెట్టబడియున్నవి- మరియు ధాన్యముయొక్క ఖరీదును వెంటనేరైతులకీయక ముందుగాధాన్యమువసూలుచేసికొని తరువాత దానిఖరీదుమునిచ్చుటపద్ధతికూడ బీదరైతులకు సంకటమైనదిగానున్నదని రైతులనుచున్నారు.

చందా వివరాలు
సంవత్సరము చందా 6 హాలీ రూపాయలు
ఆరునెలలకు " 3-౧౦-౦ "
బ్రిటిషిండియాలో సంవత్సరం చందా కల్దారు
విడి ప్రతిక ౦-౧-౨
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominionns
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 71 | *Published on every Monday and Thursday· Hyderabad· Dn·* | 24 — 1 — 1944




## రైల్వే ఘటనల విచారణ

ఉస్మానియా విద్యాపీఠమునకు సంబంధించిన కొన్నివిషయములను విచారణచేయుటకై ఒకఉపసంఘమును ఏర్పాటుచేయవలసినదని మ. ఘ. వ. ప్రభువుగారు ఆజ్ఞాపించినందువల్ల ప్రభుత్వసభాధ్యక్షులవారు న్యాయమూర్తి రామచంద్ర నాయక్ గారు అధ్యక్షుడుగను, నవాబ్ అక్బర్ యార్ జంగ్ బహద్దర్ (అడ్వొకేటు) యస్.యం.ఆజం (విద్యాశాఖాధికారి) గార్లు సాధారణసభ్యులుగను ఫజ్లుర్ రహిమాన్ (బాలుకాస్ట్రకంట్రోలరు) గారుకార్యదర్శిగనుగల ఒకఉపసంఘమును నియోగించినారు ఈఉపసంఘమువారు "సరిగావిచారణచేసి" ఇటీవల రైల్వేప్రదేశమందును విద్యాపీఠమునందును జరిగిన సంఘటనలను దృష్టిలోనుంచుకొని, ఇకముందు ఇట్టిసంఘటనలు జరుగకుండచేయుటకును, విద్యార్థులను నెలకొల్పుటకును, మొత్తముమీద మంచివిద్యాపీఠముల వాతావరణము ఏర్పడునట్లు చేయుటకును, ఇంతేకాకుండా విచారణకాలమందు పైనచెప్పబడినట్టి విషయములనుగురించి ఏమైనను తెలుపబడినచో, వాటిని తొలగించుటకు ఉపాయములను సూచించుటకును" కోరబడినారు

ఈ ఉపసంఘమువారికి ఎవరినిగాని సాక్ష్యమిచ్చుటకై పిలుచుటకును, ఏ పత్రమునైనను తెప్పించుకొనుటకును న్యాయాధికారములకుంగల అధికారము ఇవ్వబడినది.




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S Pratap Reddy, B.A., B.L.